# ఆంధ్రీకృత

# విక్రమాంకదేవ చరితము

బిల్హణ మహాకవి సంస్కృతకావ్యమున కాంధ్రానువాదము.

సప్తదశసర్గము.

(పరిషత్తు విశారద పరీక్షాపాఠ్యము)

గ్రంథకర్తలు

వనపర్తి సంస్థానకవులు, ఆంధ్ర బిల్హణ బిరుదాంచితులు నగు

శిరోమణి- కప్పగంతుల- లక్ష్మణశాస్త్రి

కీ॥ శే॥ మాదిరాజు- విశ్వనాథరావు

ప్రకాశకులు:

ఆంధ్ర సారస్వత పరిషత్తు

హైదరాబాదు- దక్షిణము.

1950



వెల 0-8-0

# మనవి

శ్రీ బిల్హణ విక్రమాంక దేవ చరితము నాంధ్రమునఁ బరివర్తించి యిప్పటికి రమారమి ౭ సంవత్సరములకాలము గడచినది, ఈ మహా కావ్య భాషాంతరీకరణమునందు ముఖ్యముగా కీ॥ శే॥ శ్రీ మాదిరాజు విశ్వనాథరావుగారు సలిపినకృషి ప్రశంసనీయము. వారు నాకుఁ గవితాగ్రజులు. వారి శ్రద్ధా కార్యదీక్షలే యీకావ్యమున మూర్తీభవించిన వనుటలో నావంతయు నతిశయోక్తి లేదు. వారిజీవితకాలములో నీకావ్య ముద్రణమునకుఁ బలుప్రయత్నములు సాఁగించినను దురదృష్ట వశాత్తు మా ప్రయత్నములు నెఱవేరలేదు. వారి కవితా జీవితకాల మంతయు వారితోఁ గలిసిమెలసి వారికిఁ జేఁదోడువాఁదోడుగా నుండి నా దౌర్భాగ్య వశమున వారియంత్యకాలమున వారిని దర్శింపఁ జాలక పోయితిని. 'ఈకావ్యమెట్లైనను బ్రకటింపజేసినఁ గాని నాయాత్మకు శాంతి చేకూర' దని వారు నాకుఁ గడసారమాటగాఁ జెప్పి పుచ్చినారు. ఈ ముద్రణమును నెఱవేర్చుటయే వారికి నేను జూపు శ్రద్ధాంజలి. ఈకావ్యమందలి ౧౭ వ సర్గముమాత్రము పరిషత్తువిశారద పరీక్షకుఁ బాఠ్యముగ నిర్ణయించి దీనినిఁ బ్రకటించిన తత్కార్యకర్తలు మాకృతజ్ఞతలకుఁ బాత్రులైనారు.

ఇందు దోసఁగు లేవైన నున్న నవి నావిగను సొమ్ములు శ్రీ రావుగారివిగను రసజ్ఞ లోకము భావింతురుగాక యని వేఁడెదను.

అడిగినతోడనే దీనికి నుపోద్ఘాతము వ్రాసి యిచ్చిన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికిఁ గృతజ్ఞుఁడను.

ఇట్లు

1-11-50

సహృదయ విధేయుఁడు,

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

# తొలి పలుకు.

సంస్కృతభాషలో విక్రమాంక దేవచరిత్రమును రచించిన కవీశ్వరుడు బిల్హణుడు. సంస్కృతమందలి చరిత్రాత్మక కావ్యములలో బాణుని శ్రీ హర్ష చరిత్రము, బిల్హణుని విక్రమాంక దేవచరిత్రము ముఖ్యముగా పేర్కొనదగిన గ్రంథములు. ఈ యిద్దరుకవుల ముఖ్యోద్దేశము కావ్యరచనమే యైనప్పటికి, నీగ్రంథములలో నాయారాజ వంశీయులకు సంబంధించినట్టియు, గవులనుగూర్చినట్టియు, జరిత్రపరిశోధకుల కుపయుక్తములగు వివరములు గలవు. భారతదేశ సాహిత్య చరిత్రమున కుపయోగించు విలువగల సామగ్రి యెంతయో యీ రెండు గ్రంథములయందు గలదు.

బిల్హణుని విక్రమాంక దేవచరిత్రమును రెండుభాగములుగా మనము విభజింపవచ్చును. మొదటిది చాళుక్యరాజులను గూర్చిన వివరములు గల భాగము. రెండవది కవి స్వీయచరిత్రమునకు సంబంధించిన భాగము.

బిల్హణునిగూర్చి యొకకథమన దేశమున వ్యాప్తిలో గలదు. ఆయన యొకరాజపుత్రికకు నుపాధ్యాయుడుగా నుండెననియు, నారాజపుత్రిక సౌందర్యమునకు ముగ్ధుడై యాయన యామెను వలచినాడనియు గ్రమక్రమముగా గురుశిష్యులమధ్య ప్రణయసంబంధ మేర్పడిన దనియు, నీప్రణయగాథ శిష్యురాలితండ్రికి దెలిసి, యాయన బిల్హణునికి మరణదండన విధించినాడనియు, నీమరణదండనవృత్తాంతము తెలిసినంతనే హృదయవేదనలో బిల్హణుడు తనప్రేయసినిగూర్చి రసవంతమైన యొక ఖండకావ్యమును రచించెననియు, నీఖండకావ్యము ఎవరివలననో రాజుగారు విని మరణదండననుండి ఆ కవీంద్రుని విముక్తునిజేసి, తనకుమార్తెతో వివాహము గావించె ననియు, నొకకథ మన దేశ

ములోఁ బ్రచారమునం దున్నది. కాని యీకథ నిజమైనది కాదనియు, నొకవేళ నిజమైనప్పటికి నా బిల్హణునికీ, నీబిల్హణునికి సంబంధము లేదనియుఁ జరిత్రపరిశోధకుల యభిప్రాయమై యున్నది. అంతేకాక విక్రమాంక దేవచరిత్రయందలి స్వీయచరిత్రభాగమున బిల్హణుఁ డీవిషయమై ప్రస్తావించలేదు.

విక్రమాంక కావ్యమునందలి తుదిసర్గలో బిల్హణునిచరిత్ర, చాళుక్యరాజులచరిత్రకు సంబంధించిన వివరములున్ను గలవు. ఈసర్గయే చరిత్రపరిశోధకులకు ముఖ్యమైనది.

బిల్హణుఁడు కాశ్మీరములోని మధ్యదేశ బ్రాహ్మణకుటుంబమునందుఁ బ్రవరపురమునకు మూడుమైళ్ళ దూరమున నున్న కోణముఖ మను గ్రామములో జన్మించెను. ఆతని ప్రపితామహ పితామహు లిద్దరు గొప్ప యగ్నిహోత్రులు. వేదాధ్యయనపరులు. ఆయనతండ్రి జ్యేష్ఠకలశుఁడు. మహాభాష్యమునకు వ్యాఖ్యానము వ్రాసిన వ్యాకరణవేత్త. ఆయనతల్లి నాగదేవి. బిల్హణుఁడు వేదములు, వ్యాకరణము, అలంకారశాస్త్రములందుఁ గూలంకషముగ పాండిత్యముసంపాదించెను. విద్యాభ్యాసము ముగిసినతరువాత, యాయన బహుదేశసంచారము గావించి, తుదకుఁ గల్యాణపట్టణముఁ జేరుకొని యప్పటివిక్రమాంక దేవుని యాస్థానమున ముఖ్యపండితుఁడుగా(విద్యాపతి) గౌరవము పొందెను. తన బహుదేశ సంచారమునుగూర్చి బిల్హణుఁడు వివరముగా వర్ణించియున్నాఁడు.

బిల్హణు నాస్థానపండితునిగా నియమించి గౌరవించిన విక్రమాదిత్య త్రిభువనమల్లుఁడు 1076–1127 వరకు కల్యాణపట్టణము ప్రధాననగరముగా రాజ్యపాలనము గావించెను. ఇందువలన బిల్హణునికాలము 11వ శతాబ్దియని స్పష్ట మగుచున్నది. విక్రమాంక దేవచరిత్రలో 1088వ సంవత్సరమున మధ్యభారత దేశముపైన విక్రమాదిత్యుఁడు గావించిన దండయాత్ర వర్ణితము కాలేదు. అందువలన 1088కిఁ బూర్వమే విక్ర

మాంకదేవ చరిత్రరచియింపఁ బడియుండుటయు విశదమగుచున్నది. ఈ గ్రంథమందలి యితర వివరములుగూడ నీవిషయమునే నిరూపించుచున్నవి.

బిల్హణుఁడు పంచాశిక, విక్రమాంకదేవచరిత్రలే కాక రామచరిత్రి మఱియు నలంకారశాస్త్రమునుగూడ రచించినట్లు, ఇతర కవుల గ్రంథములలోఁ జేసినప్రసక్తివలనఁ దెలియుచున్నది.

బిల్హణుని విక్రమాంకదేవచరిత్రము నానాలంకారవిన్యాసములకును, ధారాశుద్ధికిని, భాషాసారస్యమునకును, నాటకపటిమ యున్న బిల్హణునికి వైదగ్ధ్యకీర్తి. విక్రమాంకదేవచరిత్రమున బిల్హణుని కవితాప్రతిభను నిరూపించుఘట్టము లెన్నియో కలవు. ఆహవమల్లుని మరణమును వర్ణించుఘట్టము కరుణారసపరిపూర్ణమై యొప్పుచున్నది.

ఈ గ్రంథమును తెలుఁగులో శ్రీ మాదిరాజు విశ్వనాథరావు గారు, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి గారు పరివర్తించినారు. వీరిద్దరు వనపర్తి వాస్తవ్యులగు విద్వత్కవీశ్వరులు. వీరిలో శ్రీ విశ్వనాథరావుగారు కొంతకాలము క్రిందఁ బరమపదించిరి విశ్వనాథరావుగారు సంస్కృతాంధ్రాంగ్ల పారశీక భాషాపండితులు. శ్రీ లక్ష్మణశాస్త్రిగారు బహుభాషాప్రవీణులు. సంస్కృతాంధ్రములయందుఁ గవిత్వముఁ జెప్పఁగలసమర్థులు. ప్రస్తుతము హైదరాబాదు ప్రభుత్వ సమాచారశాఖ యందున్నతోద్యోగులుగా నున్నారు. వీరు ఆంధ్ర సారస్వత పరిషత్తు ముఖ్యకార్యకర్తలలో నొకరై భాషాసేవ చేయుచున్నారు.

ఈ తెలుఁగు విక్రమాంకదేవచరిత్రమునకుఁ దగినయాదరము ఆంధ్ర పాఠకలోకమునుండి లభించఁగలదని యాశించుచున్నాను.

**దేవులపల్లి రామానుజరావు**

ఆంధ్ర సారస్వత పరిషత్తు ఉపాధ్యక్షులు.

# ఆంధ్రీకృత
# విక్రమాంకదేవ చరితము

సప్తదశ సర్గము.

## రాజ్యపాలనము

చ: పుడమిపయిన్ నెగుల్దిగులుఁ బొల్పుటఁ జేసి సహర్షచిత్తుఁడై
యొడయఁడతండు యాచకుల కూర్చె బంగరువాన; లోకుల
దెసనిడుమల్ దొలంచఁగ మదిం బురికొల్పసివారికల్మి లె
పుడు మెఱుఁగుంజిగుర్లసరిఁ బోలి తిరంబులు గాక యూఁగెడి

క|| పుడిసిలి నెసఁగినకాలమునఁ
బొడమినబల్దొరల నితఁడు ప్రోడ యగుచుఁ దా
నడఁచెం బ్రజలం దొదవెడు
బెడిదపుమనుజరుజ గాక విధికృతరుజయున్.

క|| మము నీటన్ నించుసమ
ద్రము లీన్నృపువశ్యము లనుతలఁపున నన న
ద్దములు క్షమావరుసేవా
సమనుస్మృతిన్ సముపయోగజలముల విడుచున్.

సీ| అదను గాకయ మిత్తి పొదవఁ బో దెటనేనిఁ;
గఱ వరయఁగ రాదుగా యెక్కైన;
మానుసులఁ గడు విన్మానికం బలయింపఁ;
డలఁతనె తొలఁచ గాడ్పులరి వీచుఁ;
బండ్లు చెట్లను గదుర్ బరువున భంజించి
బెదరునవలెఁ గాంచుఁ వెల్లఁదనము;

న్నాణము దోఁప వారిశ్రవణంబులయందు నివాస మూనుఁ గ
ల్యాణము; నైజగౌరవము హానిఁ గనన్ నృపుత్యాగపద్ధతిన్. ౯

తే॥ గీ॥ తామ్రవరసవ్వర్ణచారుభూషాప్రభాఽఽళి
బెరసి, పింగళకాంతిచే వెలుఁగునర్థి
కులము వేలుచు నున్నట్లు తలఁచి వదలె
నర్థిదుర్గతి ప్లోషభయాన ననఁగ ౧౦

చ॥ తలఁ గలవేల్పువాసము లధస్థ్సలిఁ గూలెడిభీతిఁ ద్రుంపగాఁ
దలకొనఁ డంచుఁ ద్యాగి యగుతత్పతినుండి భయంబు వీడియుం;
"దొలఁగుము; ఱేఁడు వచ్చె; నిదె త్రుంగుదు," వంచు వచించునట్లు
దవ్వులఁ జనునర్థికోటికి నృపుం డిడుపైఁడిఁ గలంగె మేరువున్ ౧౧

---

## దేవాలయము

క॥ నరవరుఁ డూన్చినకమలా
వరుని నితాంతోన్నతోదవసితం బొప్పెం;
గరముఁ బ్రబలుకలిఁ దొలఁచఁగ
ధరణీజఠరంబు వెడలుధర్మాకర మనన్. ౧౨

క॥ తారామార్గ మొరయుతద
గారముఁ దొలఁగి చనురవికిఁ గలిగెను శ్రీదై
త్యారిం దూఁకమి, సప్తులుఁ
గూరమి బన్నంబు సిద్ధగుణయుగళిమునన్. ౧౩

చ॥ దనుజుని జా ప్మగల్ప హారితం గనె నీతఁ డటంచుఁ దద్రమే
శునిఁ గని భీతిఁ బోలెఁ బొడసూప దటం గలికాలదంతి; త
ద్ఘనతరనాభిపంకజముఁ గాంచఁగఁ దుమ్మెదది మ్మహర్నిశం
బనఘువినీలధూపపటలాఽఽవృత మాగుడిఁ గాంచి పాయుచున్. ౧౪

శా॥ ఆదేవాలయశృంగభాగమున సొంపారున్ స్ఫురన్మౌక్తిక
ప్రాదుర్భూతరుచావళిం గనకకుంభంబుల్ నభశ్చుంబులై;
యాదిత్యాశ్వచయంబుదూపఁ గొని తోయభ్రాంతిమై వానిపై
నూఁదన్ మోములు; వానిఫేనముల సంయుక్తంబులై మించెనా! ౧౫

చ॥ అచటిపురంధ్రినృత్యములయందు మణీమయసాలభంజికల్
ప్రచురతరాత్మకాంతిపరిపాటి వహించుచు మోదబాష్పతా
రచనము లుల్లసిల్లునభిరామదృశాస్ఫురణంబు లూనెనా!
రుచిరములై సజీవములరూఢి సదా సిరు లీనుచుండెడిన్. ౧౬

తే॥ గీ॥ అచటిప్రాంగణసీమ నాట్యంపుఁజెలులు
మేల్మితాపరత్నముల బింబించి యంబ
రాటవోద్యదంబరచరాస్యాతివేల
పదముఁ గనినట్లు మేలిమిప్రభలఁ గనిరి. ౧౭

---

## తటాకము

ఉ॥ కారణమానుషుం డగునృకాంతుఁడు రుద్ధదిశాముఖంబుఁ గా
సార మొనర్చె దేవళముసమ్ముఖభాగమునందు; నల్గడల్
సేరి యతుల్యమై చెలఁగి, శ్రీ రహి మించుసరస్సు కెట్టు లు
త్సారితలక్ష్మియైనపయసాన్నిధి యీడగు నీయిలాతలిన్. ౧౮

తే॥ గీ॥ అచ్యుతాంఘ్రిసరోజపరిచ్యుతిఁ గని
సురనికేతనగర్భంబుఁ జొచ్చి వెడలి,
వచ్చుసురనిమ్నగాశేషవారిఁ బోలె
నత్తటాకంబు వొదలు స్వచ్ఛాంబువులను ౧౯

తే॥ గీ॥ దానలోభాన నీధరాజానికడకు
నెప్పుడేనియు వచ్చెనే నిల్వలారి,

యాతనిదర్పంబు భంజింతు ననినయట్లుఁ
జెరువు గర్జించు దరిఁ బగుల్తరఁగలరుతి. ౨౦

తే॥ గీ॥ హారవారాశిసంగమకాంతి మించఁ
గానినియమంబు నీ కేల గంగ! పూని,
ననిటుల్ హర్షగాద్గద్యమునఁ దటాక
మూర్తికరముల దాని మిన్నొడిసి లాగు. ౨౧

చ॥ మును జనకాఽఽత్మజావరుఁడు పూన్చినసేతువుబంధనంబునన్
వననిధి గాంచె భంగ; మల వార్ధికిఁ దా నుదయించుటన్ వచిం
చినఁ గడుఁ జుల్క నౌ ననుచు జిష్ణుసిదంతి యనిందితాఽఽత్మ మై
తన రెడునీతటాకమునఁ దా నుదయించుటఁ దెల్పు నింతికిన్. ౨౨

క॥ జలదము లీకాసారం
బులఁ గోలుచు శుక్తులందు ముక్తాశ్రీలం
గొలుపఁగఁ బురాణముక్తల
కలరదు లలనాకుచస్థలాఽఽరోహణముల్. ౨౩

ఉ॥ ఎన్నిక మీఱునేఱు లెనయించెడిమోములు గోలి నిల్చుచుం
బన్నము గూరుభంగయుతవారిధినుండి తొలంగెనాఁగ, న
త్యున్నతి నండకొండలసముద్భవ మందునదుల్ నిదాఘ మే
గ, న్నగరీతటాకపరికల్పితమార్వ్వన మాక్రమించెడిన్. ౨౪

---

## పట్టణము

క॥ సుర, వాణీవర, లోకో
త్తరభాగము లంది యొలమిఁ దాఁ గూర్చెననాన్
బురముం బ్రహ్మపురాఽఽవృత
మునసక్తిన్ నిల్పె నాతఁ డోగి నచ్చటన్. ౨౫

చ॥ మొదటిగవాక్షముఁ దవలి ముద్దియ మోము ద్వితీయ మంటి పెం
పొదవుట కేలఁ బ్రోలున సమున్నతసౌధవిటంకలంఘనం
బొదవుటయందు శంక గొని యుద్ధవిడిన్ నమమం బ్రవేశమై
చదురున దాఁటి పోవు నని చందురుఁ గూర్చి తలంపనయ్యెడిన్. ౨౬

మ॥ అట సోపానములన్ నితంబినులు దా మారోహణం బూనుచోఁ
గటిభారంబునఁ దూఁగఁబోదు రని నిక్కన్ భీతి, భిత్త్యోఘముల్
దిట వ్రాన్పుంగఁ దలంచెనాఁగఁ గృపఁ జెందించున్ నిజాట్టాపదో
త్కటభాదండములం దదీయకరసంతానంబులం దూఁతగన్. ౨౭

తే॥ గీ॥ అచటియగ్రగవాక్షతుంగాలయముల
తుంగిమంబు గడించెం బెన్ దూషణంబు;
నచటిచిత్రస్థితద్విరదాళికిన్
శక్రదంతికి ధావనశంక గలుగ. ౨౮

ఉ॥ ఆపురిపైఁ దిరం బగునిరంతరతుంగసమంచితావనీ
స్థాపితకుట్టిమస్థలుల సారసబాంధవసైంధవాళి తా
రాపథమందు నూఁతఁ గనరానిశ్రమం గడుదూర మైననుం
బాపికొనున్ స్వకీయపదపాళిఁ గదింపుచు నింతనంతటన్. ౨౯

మ॥ ప్రతిబింబాధ్వములం దిరియామములనాప్రాలేయభానుండు భూ
పతిపౌరి ల్సెంది యటం బురంధ్రిజనతాప్రాంచత్సుదోలాళయిత
శ్రుతిభూషాళయితరత్నకుండలరుచాక్షుబ్ధాళత్మఁ డై యంతఁ ద
త్సితనాళీకదృశాకపోలసుమమాక్షీరంబులన్ మున్గెడున్. 30

కం॥ హారి గురువు తల్లి యిందిర
యిరువుర కిది యిర వటంచు నెఱుఁగుటనువలెన్
మరున కనేకాన్యాయ్యాళ
కడునరు నెప్పుడేని నడ్డు కలుగదు నగరిన్. ౩౧



# వదాన్యత

మ॥ ప్రతిపర్వంబున నాప్రతాపనిధి భూపాలాంబుజాతారి యు
న్నతచిత్తంబున నల్ప షోడశమహాదానంబులం దానని
స్సృతవాఃపంకిలతత్పురీనికటధాత్రిం గూలుభీతిం బలా
యితుఁడై దత్పురిఁ బాయుచుం గలి యెడే
నిచ్ఛావిహారాదృతిన్. 3౨

క॥ తుంగస్వర్ణోత్కరములఁ
దుంగసరిగఁ జూచుదానధుర్యుఁ డయినరా
ట్పుంగవులోభాస్పదయశ
ముం గరము పటీరపాండుమూర్తినిఁ దాల్చెన్. 33

చ॥ తలఁ గల పైఁడిదానములఁ దత్పరుఁ డానరపాలునుండి భీ
తిలి తపనీయభూధరము తెల్పును దాల్పఁ దలంచెనాఁగ ను
త్పలమఱ నేస్త్రిమండలముఁ బారదపిండ మటంచుఁ దాఁకు ని
చ్చలుఁ దనతుంగశృంగములఁ జాఁచి స్వకాంతిపిధానవాంఛమై. 3౪

క॥ కనకతులారోహణమును
జనపతి ద్విజకల్పశాఖి శత్రుజయుండై
పౌనరుప నగస్త్రి రాఁగలఁ
డని యున్నమనంబు వింధ్య మభిలాషించెన్. 3౫

క॥ కడుఁగడుఁ బసిండి నీతం
డిడఁగ నడలి పైఁడికొండ ఋష్యాధ్వశ్రీ
దొడరినటులఁ దనపసిఁడినిఁ
గడునల్పం గాంచినట్లుగాఁ గనఁ జేసెన్. 3౬

తే॥ గీ॥ దానలీలారతుండు ప్రతాపశాలి
ధారుణీనాన్వయములు రిక్తములు సేసి

యరిజనగేహముల నించె హాటకముల
దిఙ్ముఖంబుల సద్యశస్స్థితుల నిపెచె. ౩౭

తే॥ గీ॥ చక్రవర్తిశిరస్స్థితి సౌరుఁ గాంచి
విశ్వచక్రర్ధినియమప్రవీణుఁ డగు ను
దారశీలుఁడు ప్రతికూలతను గడించె
నిలను లేమినిఁ గల్పించు నలువవలన. ౩౮

---

## యుద్ధము

ఆ॥ వె॥ పగఱకలవుచేత భండనంబులు లేమి
బాహుఖర్జు వెరఁగుపార్థివుండు
చోళుగర్వ మెఱిఁగి వాలగుననిఁ గోర్కి
పురికొనంగఁ గాంచిపురము దరిసె. ౩౯

చ॥ సిరి కుదయింపఁగాఁ దగినసింధుజలోన్మథనంబు, పోరులన్
సరగున లేపి తుష్టిఁ గనుసంయమికీక్షణపారణంబు, ని
ర్జరధనమానినీజనముచాయఁ గ్రియాఽఽపణ, మిట్లు మించు సం
గరముఁ గ్రమంబునన్ సలుప గా సమకట్టిరి చోళకుంతలుల్ ౪౦

తే॥ గీ॥ ఉచ్చలద్వీరరస జృంభితోర్మినిర్మ
లములు సుభటాసియష్టు లుల్లసిలెఁ గోశ
బిలవినిర్గతిఁ గని నాకబిలము వెడలు
కాలపాశానిలాశనకాండము లన. ౪౧

ఆ॥ వె॥ జయరమాపరిభూత సౌభాగ్యవశమున
బలయుగంబుభటులు చలము మీఱఁ
బరుఁగు లిడుచు నొగులు వడిరి వడిన్ మున్ను
సాఁగి పోవుబాణచయముచేత. ౪౨

తే॥ గీ॥ తనయురమ్మున నిఱికినదంతిరదముఁ
గత్తిచేఁ ద్రుంచి దవ్వుగాఁ గరినిఁ బఱపె
బిలమునం బ్రాణముల్ బయ ల్వెడకుండఁ
గీలకంబుఁ బ్రతిక్రియాఽఽకృతిగఁ జేసె. ౪౩

తే॥ గీ॥ అర్ధచంద్రశరంబున నర్ధకృత్త
మూర్ధ మసియాడుచున్ భటుమూఁపునందుఁ
జేర డాకేల నది గొని పాఱవిరుఁ
డెల్ల జనులపొగడ్తకు నిక్క మయ్యె. ౪౪

తే॥ గీ॥ కంకటయుతుం డొకండు వక్షస్థలమున
విఱుగుముఁగ్కలవహ్నిచే నెఱిఁగఁబోఁడు
పరుఁడు మోమునఁ గూర్చుకృపాణధారఁ
బొగ యనెడుభ్రాంతి నది మదిఁ బొధివికొనఁగ. ౪౫

తే॥ గీ॥ అరికరి రదాంకురప్రోత మైన మోము
పులకనికరాంచితం బయి పొలుపు మిగులఁ
గనఁగనయ్యె సలీల నొక్కఁడు మృణాల
దండమునఁ గీర్తిసుధ నానుచుండునటుల. ౪౬

తే॥ గీ॥ మఱిమఱి నరాతిశరముల నిఱుకునెల్ల
నఱుకులైనసిజాస్థిపంజరముఁ దాల్చి
వెరవుగా సూర్యమండలోదరమునందు
సుఖముగాఁ దూరుటకుబోఁలె సుభటుఁ డొకఁడు. ౪౭

తే॥ గీ॥ ఎడనెడన్ రక్తపంకమం దడరునుష్ణ
కరుని ప్రతిబింబమాలిక కరముఁ దాల్చె
రక్త మానెడికోర్కిఁ జేరంగ వచ్చు
యామినీచారిణీపారికాఽఽళి పోల్కి. ౪౮

తే॥ గీ॥ తనఁ బొదివిఱట్టిముల్కుల ఘనభరమున
నెదిరి నదటున విదళింపఁ జనురుఁ గనని
తనభుజంబును గాంచెఁ బెన్గనుకతోడ
మిగుల వైలక్ష్యవంతుఁ డౌనుగఁ డొకండు. ౪౯

తే॥ గీ॥ తనదుకరకర్ణఖండనమున వమాన
మునకుఁ దగువిధి భటునిచేఁ బొంది లజ్జ
మిగులఁ దాల్చినయటు నగ్గినిగఁ జెలంగు
క్షతజనది మున్గె నొకమహాసామజంబు. ౫౦

తే॥ గీ॥ దంతములు రెండురెండుగా దారితముగ
దంతములు నాల్గు దాల్చువిధంబు గాఁగ
దంతి యొక్కటి వేల్పుచౌదంతి పోలుపు
వడసె, బల మెల్ల దేవభావంబు నెంద. ౫౧

ఉ॥ వా లగుసాము రేవెలుఁగు వాలులఁ దున్మయి దవ్వు దూఁకి ద్యో
పాళికి; నాపయిం బృథివి వ్రాలెడుదంతిరదాంకురాళివల్
వేలుపుఁబూలసోన యని వింతగఁ జూచుభటాళికెల్లఁ బ్రా
ల్మాలిక దోఁప వారితలలం గుఱి దప్పక కొట్టు బిట్టుగన్. ౫౨

తే॥ గీ॥ అలరులకు విల్వ యెచ్చునీయదనునందు
ద్వ్యస్రిజంబులు లుబ్ధత నూన్చు నీకు
నవశిరీషసుమమృదు బాహువుల నిపుడు
నుంచకుము సంవరణామాల నూఁచుచోట. ౫౩

తే॥ గీ॥ వరులకఱ లేమి యిట లేదు పరవధూటి
కోనినవరు వరవర్ణిని! కోరు దేల?
నిజపరీక్షావిషయమున నీదు నేర్పు
నల్పముగఁ జేయుదురుసుమా! యమరసతులు. ౫౪

తే॥ గీ॥ మూర్ఛమోఁ! గన్నులను మూయ ముధగ వీరి
వ్యోమయానంబునందు నీ వుండఁ గొంటి
వదిగో! తేటి నోసల్ మాడ్చి కదనభూమి
నుత్సుకత మీఱి మఱిఁ బడుచుండ్రు కనుము! ౫౫

ఉ॥ మేరఁ దొరంగి యీభటుడు మేకొనె జేష్టితముల్; విమానపుం
సోరణగండినుండి పెఱసుందరి దన్గనినంతమాత్రనే
యారమణీలలామమునకై త్వర సేసెను చూడు వీఁడు, తా
నోరమణీ! నినుం మొదల నొందినవిందయి యుండియుం సుమా ౫౬

తే॥ గీ॥ తొలుత సతనికి మాల యే వెలఁది యిడెనొ?
తెలియ దిద్వరు మీరు వాదించుచుండ;
నితఁడు సౌభాగ్యనిధిః రణవ్రతపరుండు
స్వయము వచియించుఁగాక నిశ్చయవిధంబు. ౫౭

చ॥ సొబఁగుమదంబునం మరులు సొన్పి మఱుంగున నున్నదీనిచేఁ
బ్రిబలపుమోస మొంది వలరాజువెతం గనుఁగానట్టి వీఁ
డబల! త్వరం బరాజ్ముఖత నందుఁ బిశాచి భ్రమించి చేరి; వే
డబమువిధం బెఱింగి వడి డాయక పాయు వెడంగునై వడిన్. ౫౮

తే॥ గీ॥ పరుల కుపకార మొనరించు సరణులందు
నారదునకన్న లేఁడు విశారదుండు;
త్రుటిని ఘనకదనంబులఁ దొడరఁ జేసి
కాముకాభావతను మాన్పుఁ గనఁగ మనకు. ౫౯

చ॥ కడఁగి సహర్షులై భటులకంఠములం గ్రహియించి కౌతుకం
బడఁగఁ గడుంగడుం బరుఁగువారు సురక్రియనాయికావళిన్
వెడవిలువకాని మేల్గొలిపి పేర్చుకథాకలనంబు డంబుగా
నడరెను గగ్నవీధి సమ్మృతామలపేశల మాఁచు సద్యోడన్. ౬౦

తే॥ గీ॥ ఇంతలోఁ గుంతలుఁడు జయదంతి నెక్కి
జ్యానినదనిష్ఠురముగ శిఞ్జాశరవ్య
సరణిఁ బరబలభటసముత్కరముఖముల
విశిఖపంక్తుల నినిచె దోర్విక్రమమున. ౬౧

ఉ॥ ఏనుఁగు లెక్కునక్కరుల నేనుఁగులంద, తురంగవాహనా
నూనభటాళి నశ్వముల నుండినయట్టులనే, పదాతిసం
తానములన్ ధరాస్థలిన, నామసమంకితపత్రిసంతతిన్
స్థానమునంద కీలిత మొనర్చెఁ జళుక్యుఁడు చోళసైన్యమున్. ౬౨

ఉ॥ వేఱు వచింప నేల? పృథివీపతి యెచ్చట మచ్చరించినం?
దీఱుఁదెఱంగుగా వసుమతీ తిలకంబులకుం ద్వయంబె; పెం
గాఱెయకారఁ గంటయుఁ వికావికలై దవు వాఱుటల్, త్వరం
బాఱెను నట్టులాట గరువం బఱి చోళుఁడు ప్రాణభీతిమై, ౬౩

ఉ॥ ఆపయి శీర్ణకార్ముకత నాపతి చోళరమం గ్రహించి. కాం
చీపురమందు సత్కవుల శిష్టవినోదములందుఁ దేలుచున్
రా పగుదంతివాహినిభరంబు దిశాంతర మావరింపఁగాఁ
బ్రాపితశాశ్వత ప్రమదభంగిఁ జనెం దనవీటి కెమ్మెమై. ౬౪

ఇది శ్రీ మద్వేంకటరమణ కరుణాకటాక్షలబ్ధ సరస కవితాధురీణులు
వనపర్తి సంస్థానాస్థాన కవివరులు ఆంధ్రబిల్హణబిరుదాంచితులు
శిరోమణి.కప్పగంతుల లక్ష్మణశాస్త్రి మాధిరాజు విశ్వ
నాథరాయాంధ్రీకృత బిల్హణకవి విక్రమాంక
దేవ చరితంబున సప్తదశసర్గము
సంపూర్ణము.

# పండితాభిప్రాయములు

## శ్రీ మానవల్లి రామకృష్ణకవి, ఎం. ఏ. తిరుపతి

బిల్హణ మహాకవి ప్రణీతమగు విక్రమాంకకావ్యము నింతవఱ కెవ్వరును దెలిఁగించలేదు. ఇప్పుడు వనపర్తి సంస్థాన వాసులైన బ్ర॥శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, శాఖాపరము- విశ్వనాథరాయామాత్యయుఁ డును గలిసి దానిఁ బద్యరూపమున యథామూలముగాఁ దెనిఁగించుట భాషకుఁ బరమోపకారము సేసినట్లే. వీరి పద్యకావ్యములోఁ జాలభాగము మూలముతోఁ బోల్చి చదివినాఁడను. అర్థగాంభీర్యము, భావరస విశేషములు, చరిత్రాంశములు చెడిపోక రసవంతముగా వీరు దీనిని రచించి రనుట నిస్సంశయము అనేకపద్యములు సంస్కృతము లోనుండి యనువాదములని తోఁచక యిది మూలగ్రంథమువలెనే కవితాప్రౌఢిమ వహించి విలసిల్లుచున్నది. ఇట్టి రచన చాల దుర్ఘటము. ఇట్టి గ్రంథమును బలువు రాదరించి ప్రచురింపఁ జేయుదు రని ప్రార్థనము.

—...—

కళాప్రపూర్ణ, కావ్యస్మృతితీర్థ,

## శ్రీ జనమంచి శేషాద్రిశర్మ కడప

వనపర్తి సంస్థాన విద్వాంసులు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, మాదిరాజు విశ్వనాథరావు గారలు బిల్హణ విక్రమాంక దేవచరితము నాంధ్రీకరించిరి. అముద్రితమగు నీ యాంధ్రకృతిని గవిద్వయముఖమున వినుభాగ్యము నాకుఁ గల్గినది. వీరి కవితాధార హిమవన్నగశృంగనిస్సర న్మందాకినీప్రవాహమువలెఁ బరమపావనమై యుఱ్ఱూరుచున్నది. సంస్కృతాంధ్రములు రెండును నీకావ్యమున సమానముగ వెలయుచున్నవి. కవిత్వము సహజగాంభీర్యము గలిగి వెలయుచున్నది. ఇకాల ముమున నిట్టి కవిత యున్నదే యని యచ్చెరువు నొందుచున్నాను, వీరిం

కను నిట్టి యుత్కృష్టగ్రంథముల వ్రాసి త్రిలింగదేశ విఖ్యాతినిఁ బెంపొందించుదురు గాతమని యాశీర్వదించుచున్నాను. ప్రాచీనకవులం దలరింపఁ జేయు నిమ్మహాకావ్యము ఇల నాచంద్రతారార్కము వెలయుచుండుఁగాక.

—...—

## ఆచార్య రాయప్రోలు సుబ్బారావు హైదరాబాదు

బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, శ్రీ మాదిరాజు విశ్వనాథరావుగారలు కలిసి తెనిఁగించిన విక్రమాంకదేవచరితమును వినిపించిరి. అవధానంతోను అనురక్తితోను విని ఆనందించితిని. ఇంచుమించు ఎనిమిది గంటలకాలం కనబడకుండా గడచిపోయింది.

బిల్హణ మహాకవి సంస్కృతకావ్యం దీనికి మాతృక. అనువాదమును యథానేదిష్ఠంగా సాధించుటకై కష్టించిన కవులు కృతార్థులు. కావ్యమైనప్పటికీ చరిత్రచిత్రణమైన యిలాంటి కృతులను ప్రతిబింబములుగా తీర్చడమే న్యాయము.

గ్రంథములో ఆయా సన్నివేశములను నేను కావలెనని కాంక్షతో చదివించి వింటిని. వాచాప్రసాధనం ప్రసన్నంగాను భావనాసంపన్నంగాను నాకు స్ఫురించింది.

కవి ఎంతసమర్థుడయినా అనువాదసంఘటనలలో ఉండే అస్వతంత్రత, అన్యానుసరణ పరతంత్రత తప్పనదికాదు. ఈ సంకోచ సంకటాలను సవరించి సవదరించుకోవడంలోనే అతని సామర్థ్య సంపత్తులను గుర్తించవలెను. అనివార్యములైన ఇరుకులలో ఈకవులు కుశలంగా కృతకృత్యులైనారు.

చక్కని శైలి, సళ్ళులేని పదబంధము, సౌష్ఠవ మాధుర్యములు గల భాష అనువాదకుల రచనకు వన్నెపెట్టుచున్నవి.

విషయగౌరవాన్నిబట్టి, రచనాపటిమనుబట్టి ఇలాంటి మనోహర గ్రంథములు విద్యాలయములలో పాఠ్యగ్రంథములుగా ఎన్నుకోదగినవి.

## శ్రీ అనుముల వెంకట సుబ్రమణ్యశాస్త్రి. కర్నూలు

విక్రమాంకదేవచరిత్ర మహాకావ్య రసాస్వాదనము నేటివఱకును ఆంధ్రులు పెక్కండ్రకు లభించలేదు. ఈ యుదాత్తకావ్యమును నేటికీ మామిత్రులు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి మాదిరాజు విశ్వనాథరావుగారలు సలక్షణమైన చక్కనిశైలిలో నాంధ్రీకరించి యాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులైరి.

సంప్రదాయశుద్ధమైన ప్రయోగకౌశలము వెలయు తెలుఁగునుడికారమునకు గోరంతయుఁ గొఱంత రానీని విధమున వీరు రచించిన యాంధ్రానువాదకావ్యము స్వతంత్రకృతియో యనునంత మనోజ్ఞముగా నున్నది.

## శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి. తిరుపతి

వనపర్తి సంస్థానవాస్తవ్యులు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి మాదిరాజు విశ్వనాథరావుగారలు తెలిఁగించిన గ్రంథమును, విక్రమాంకదేవచరితమును విని తనిసితిని. ఈ మహాకావ్యమును వీరు పద్యరూపమునఁ బరివర్తింపఁబూనుటయే మిక్కిలి కొనియాడఁ దగినది. వీరు దీనిని నిర్దుష్టమగు భాషలో మూలానుసారిగా చక్కని శయ్యాసారళ్యముతోఁ దెనిఁగించిరి. ఆంధ్రు లభిమానింప వలసిన గ్రంథ మిది.

——...——

శ్రీ శతావధాని

## చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి విజయవాడ

ఈకావ్యమును వనపర్తినివాసులు శ్రీ మాదిరాజు విశ్వనాథరావు, కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారలు జంటకవులుగా నుండి యాంధ్రీకరించిరి. కొన్నిఘట్టములు కేవ లాంధ్రములుగా నుండునట్లు గూడ ననువదించిరి. అనువాదమైనను స్వతంత్ర రచనముగా నున్నయది.

ఉ. వ్యాకరణమ్మునం గలుగు ప్రజ్ఞయు, సాహితియందు గల్గు సు
శ్రీకత, తక్కు గల్గిన విశేషము వీరికవిత్వమందు విం

దై కనుపట్టుచున్నవి; మహాకవు లంటకుఁ దగ్గ వీరు స
ద్ధీకులు సర్వథా యశముఁ దేఁకువయున్ గణియింతు రిగా వుత్తమ.

---

అవధాన శిరోమణి, మహోపాధ్యాయ,

## శ్రీ కాశీ కృష్ణాచార్యులు గుంటూరు

క. సమలక్షణ వైతివి పో
సమలక్షణ విశ్వనాథ సంభవ వగుటన్;
విమలంబగు నీవృత్తము
సమ మగుఁ బూర్వకవివృత్త సరణికి ధరణిన్.

క. నవకవు లొకరిద్దరు నిన్
జవి చూడకయున్న నీ ప్రశస్తతఁ దలఁపై
న వహించెడు కవిసారస
భవు లుండక పోవ రో ప్రబంధమ ! యెప్పుడేన్.

ఉ. భాసురవాక్ప్రమత్కృతి, సుభావసమంచితఁ, జిత్రపాద వి
న్యాసవిలాసఁ, బ్రౌఢకవితాంగనఁ గుత్తుకఁ గట్టికొంటివి; రిం
తా సమె? శాస్త్రసమ్మతమె యయ్యది? యం చనరాదు; శారదా
శాసన ముంట దాని నవశాస్త్ర మనం గల రెవ్వ? రో కవుల్ !

---

మహా మహోపాధ్యాయ, కవిసార్వభౌమ,

## శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి రాజమహేంద్రవరము

ఆంధ్రీకృత విక్రమాంకదేవచరితమును గ్రంథకర్తలలో నొక రగు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు వినిపింపగా విని సంతసించితిని. మూలముతోఁ బోల్చి చూచినాను. ఆంధ్రీకరణము మూలము న సరిగా నున్నది. ఇందు ధారాశుద్ధి చక్కనిది. గ్రంథము గంగానదివలెఁ బ్రవహించుచున్నది. బిల్హణుని సంస్కృతకవిత్వ మెంత మనోహరమో వీరి తెలుఁగుకవిత్వ మంత మనోహరముగా నున్నది. వీరి

యీ కవిత్వము నిర్దుష్టమై పూర్వకవిమార్గమునకు లవమాత్ర మైనను దొలంగి యుండలేదు. వీ రింకను నిట్టి మహాగ్రంథములం గొన్నింటిని వ్రాసి యాంధ్రభారతి నలంకరింతురుగాక యని కోరుచున్నాను.

—...—

## శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు కాకరపర్తి

వనపర్తి సంస్థాన పండితు లైన క. లక్ష్మణశాస్త్రి. మా. విశ్వనాథ రావు గారు నను మహాకవులు రచించిన విక్రమాంక దేవ చరితమును నేను వింటిని. ఇది సలక్షణమై శ్రావ్య మైన భాషతో రచియింపఁ బడి నది. కవిత్వము మృదువై మనోహరముగ నున్నది. మొత్తము గ్రంథము శ్లాఘాపాత్రముగా నున్నది. ఇది మూలము ననుసరించి యెంతో నేర్పుతో వ్రాయఁబడినది.

—...—

## సర్. కట్టమంచి రామలింగారెడ్డి చిత్తూరు.

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును, మాదిరాజు విశ్వనాథ రావు గారును గలిసి ప్రబంధ రూపేణ తెనిఁగించిన బిల్హణకృత విక్రమాంక దేవ చరిత్రమును శ్రీ శాస్త్రిగారు చదువఁగా విని యానందించితిని. ఇదివరలో విక్రమాంక దేవ చరితము పద్యరూపమున నాంధ్రములో నవతరించి యుండలేదు. ఈ లోప మీ కవుల కృషిచేఁ బూరిత మైనది.

వీరి యాంధ్రీకరణము నిర్దుష్ట మైన మంచి శైలిలోఁ జేయఁబడి యున్నది. ఈ కవులు ఉభయ భాషాప్రవీణు లగుట వలన, ఆఖ్యానకమునను, తత్సమమునను రెంటను మనోహరముగ వ్రాయుట సంభవించినది. ఇది సర్వవిధములఁ బ్రశస్త మైన గ్రంథము. అందఱుఁ జదువఁ దగినది.

## శ్రీ గడియారము వెంకటశేషశాస్త్రి ప్రొద్దుటూరు

చ॥ అతులవచస్వి బిల్హణమహాకవి సంస్కృతకావ్యబంధ మ
ద్భుతకవితా మహత్త్వములు పొంపిరివో రచియించె; దానిసం

గతరసభావశుద్ధి సరిగా నుడివోవని ప్రౌఢశైలి ద్రా
సితిరి దెనుంగుబాస బుధశేఖరు 'లౌ' నని మెచ్చులాడగన్.

మ॥ అనువాదంబునఁ బెక్కు చిక్కులకు లోనై స్రుక్కుచుఁగాక, తీ
యని పద్యంబులఁగన్న మూలకృతి 'నాహా' యంద్రు; లేకున్న నీ
యనువాదంబున లోపమెంత్రు; కవులారా! యన్నిటిం దాటి మీ
యనువాదంబు స్వతంత్రమై యుభయకావ్యశ్రావ్యతం గూర్చెడిన్.

చ. నవకవితావిలాసము లనంతములై కవితావినోదహే
తువులగు; నైనఁ బూర్వకవి ధూర్వహధీరగభీరభావబం
ధువులకుఁ, బ్రౌఢబంధరసతుందిల తత్కవితాబ్ధి రత్నలి
ప్సువులకు మోదదాయక మవున్ దమకావ్య ముదాత్తవృత్తమై.

—. . .—

## శ్రీ డి. రాజశేఖర శతావధాని ప్రొద్దుటూరు

చ॥ మణులును స్వర్ణమున్ గలిపి మంచినగన్ రచియించినట్లు బి
ల్హణకవి విక్రమాంకవసుధాధిపు సచ్చరితన్ రచించె! నా
గుణనిధికావ్య మిప్డు తెనుఁగున్ బొనరించుచు విశ్వనాథ ల
క్ష్మణకవులార! సర్వబుధసన్నుతి గుత్తకుఁ గొంటి రెంతయున్.

చ॥ ఒకచో దీర్ఘసమాసముల్ నడువఁగా, నొండొక్కచో నచ్చ తె
న్గొకచోఁ గోమలసంస్కృతాంధ్రగతితో నొప్పారి మీశైలి, మా
తృక వీక్షింపనివారి కందలిరసో దీర్ణప్రభావప్రభల్
సకలంబుల్ విశదంబుసేయు ననుటల్ సత్యంబు ముమ్మాటికిన్.

మ. పదునార్వందల పెద్దసంస్కృతపుఁగావ్యం బెత్తి యాంధ్రంబునం
గొదవల్ చొప్పడనీక దొడ్డకృతిగాఁ గూర్పంగ సామాన్యమే
యది మీయిర్వుర కబ్బె మిత్రమణులారా! నాదు ప్రేమాంజలుల్
ముదమారం గొని దేశమెల్లెడ యశంబుం బెంచి శోభిల్లుఁడీ.

## డాక్టర్ చిలుకూరు నారాయణరావు అనంతపురము

వనపర్తి సంస్థాన పండిత కవీంద్రులు శ్రీ. క. సత్యనారాయణశాస్త్రి మా-విశ్వనాథరాయోపాధ్యాయకృతి విక్రమాంక దేవ చరితమును విను భాగ్యము నాకుఁ గలిగినది. ఈ కావ్యము ప్రబంధకవితకు లక్ష్యప్రాయముగ నున్నది. కావ్యబంధము చక్కఁగఁ గుదిరినది. అస్ఖలిత ధారా శోభితమై జాతీబంధురమై యొప్పు నీ కావ్య మాంధ్ర భారతి కంఠహారమున నొక యమూల్యరత్నమై వెలుఁగొందుఁ గాక. ఇప్పటి ఖండకావ్య యుగమున నిట్టి యఖండకావ్యములు పొసఁగుట యాంధ్రకావ్యసంప్రదాయ పునస్స్మరణకుఁ దోడ్పడు ననుటకు సందేహము లేదు.

—...—

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు విజయవాడ

శ్రీ మా. విశ్వనాథరావుగారు, శ్రీ. లక్ష్మణశాస్త్రిగారును విరచించిన విక్రమాంక దేవచరిత్రమును విన్నాను. వారి రచన మధుముగా నున్నది. వారి పాండిత్యము కవితాశక్తియు నుత్తమతరగతికిఁ జెందినవి. ఈ ప్రౌఢకావ్యము తెనుఁగులో ప్రౌఢి చెడకుండ మాధుర్యము చెడకుండ నింత యచ్చెరువు గొల్పునట్లు తెనిఁగించుట గొప్ప ప్రతిభను సూచించుచున్నది. వీరి ప్రయత్నము సర్వథా ప్రశంసనీయము. వీరికిఁ బరమేశ్వరుఁడు దీర్ఘాయువు నితోధిక గ్రంథరచనాశక్తియుఁ బ్రసాదించుఁగాత.

—...—

## శ్రీ దూపాటి వెంకట రమణాచార్యులు ఓరుగల్లు

శా. ఓ సాహిత్యశిరోమణీ! రసిక లోకోత్సాహసంధాన ధీ
వ్యాసంగోక్తి నిబద్ధ విక్రమకథా వ్యాకోచపుష్పంబు నా
కాసక్తిం గలిగించె; మూలమున విద్యారాశి శ్రీబిల్హణుం
డే సాహిత్య పరీమళం బిడెనొ నాకిం దద్దిరమ్మే తోఁచెడిన్,

ప్రతి పద్యంబు రసాప్లవం బయి చెలిర్పన్ బిల్హణోక్తి క్రమ
ప్రతిరూపంబుగ నాంధ్ర పద్యమచిత్రం బీవు నిర్మించి స్వా

దుతరంబైన కవిత్వవైఖరులరీతుల్ చూపినా రద్దిరా!
ప్రతిభాసంపద, సంస్కృతాంధ్రయుగళీ పాండిత్యవైచిత్ర్యముల్.

మ. సమరక్షోణినిఁ జోళు గెల్చి జయమున్ సర్వస్వముం గొన్న ప
శ్చిమచాళుక్య నృపాలవర్యు విజయశ్రీ విక్రమాదిత్య భూ
రమణున్ బిల్హణుఁ డెట్లు కావ్యమునఁ దీర్పంగల్గె నట్లే మహో
త్తమ భంగిన్ దెనిఁగించినారలు ప్రమోదం బయ్యె విద్వత్కవుల్!.

మ. కవితాచాతురి, వర్ణనాతిశయముం గావ్యంబులో నింపె స
త్కవిచూడామణి బిల్హణుం డిది చరిత్రం బాట మూలానుసా
రవిధిం దెల్గొనరించి వాఙ్మయమునన్ రత్నాలపటన్ సుధీ
నివహార్థంబుగఁ గుప్పఁబోసినకవుల్! మిమ్ముం బ్రశంసించెదన్.

సీ. రసవత్తరంబుగా రాజిల్లు వర్ణనాంశమ్ములఁ జవులూర సంతరించి,
మూలమందలియర్థమును భావమును నున్నవిధముగాఁ దెనుగున
వెలయఁజేసి,
యొకసర్గమున రసాభ్యుచిత శుద్ధాంధ్ర భాషాకవిత్వంబును సంఘటించి,
సమవేగమునఁ బారుశైవలినీ విధంబున నిరర్గళధార యనువుపఱచి,
తే॥ గీ॥ విక్రమాంకచరిత్రంబు వినిచి, నాకుఁ
బ్రమద మొనరించి తీరు; మీ ప్రౌఢకవిత
నన్ను నలరించెనో రసస్విన్నహృదయ;
సరసఁ గుర్ధ్య లక్ష్మణశాస్త్రివర్య!

---

## శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు బి. ఏ.

కొల్లాపురము.

మ॥ అనువాదం బని ధార కుంటువడలే దావంతయున్; శైలిలోఁ
గనరా దెందును లోటు; చక్కని ప్రయోగంబుల్ కళాసారముల్
గొని రాజిల్లుచునుండె; మేటియశముం గూర్పంగ నౌ నిద్ది; యొం
దున శ్రీలక్ష్మణ విశ్వనాథకవిచంద్రుల్ కీర్తిసంపన్నులే.

తే. గీ. వ్రాయఁగా నేటికో పెక్కు గ్రంథములను
జాలు యశ మెంతయైనఁ దేఁజాలు నిట్టి
కావ్యమొక్కటైన: విక్రమాంకచరితంబు
పృథివిలోఁ జిరంజీవియై వెలయుఁగాత.

—....—

## శ్రీ చతుర్వేది అమరేశ్వరశాస్త్రి

గుంటూరు.

మ॥ జటిలాక్లిష్టపదప్రకృష్టము, విశిష్టప్రౌఢభావార్థ సంఘ
టనోత్కృష్టము, పాకపుష్టము, సమాసాస్పష్ట, మాబిల్హణో
ద్భటవాక్స్పష్టము- విక్రమాంకవిభుసచ్చారిత్ర; మద్దానిమీ
కెటులాంధ్రంబున నో కవుల్! పలుకనయ్యెన్ శిష్టజుష్టంబుగన్.

మ॥ సరసంబో విరసంబొ మూలకృతిసంస్థావస్తువిన్యాసవై
ఖరి; తద్రీతికి బిల్హణుండె యగుఁ జేరీతిసద్విమృశ్యంబు; ని
ర్భరనిర్దుష్టవచఃప్రచారరుచి నాంధ్రంబునన్ దాని క
క్షరనిక్షేపముఁ గూర్చు మీప్రతిభ సంశ్లాఘ్యంబహో సత్కవుల్!

మ॥ అనురూపాన్వయభావభవ్యనిజదివ్యత్వవ్యపుంగూర్పకం
టెను; గట్టా! యనువాదముం గొలుపుటెంతే ప్రాణగోష్ఠంబె, యై
నను, వశ్యోక్తులఁ గాట బిల్హణకృతిన్ భాషించి నా రాంధ్రమం
దున, నోలక్ష్మణ విశ్వనాథ కవిచంద్రుల్ మీర ధన్యోదయుల్.

—...—

## శ్రీ కే. జి. కృష్ణమాచార్యులు

లెక్చరర్ ఏ. సి. కాలేజి గుంటూరు.

మ॥ కవితారీతులఁ గాంచి మెచ్చితి భవత్కావ్యంబు విద్వజ్జన
స[illegible]; విక్రమాంకకథ భాషాకావ్యముం జేయఁగాఁ
గవులెవ్వారుఁ దలంప రింతకు; వియద్గంగాప్రవాహంబులే
నవ[illegible] నాగ[illegible]సము రసాసారపరికర్షంబుగన్.

గీ॥ రససుధావర్షియైన గీర్వాణఫణితి,
తేనెచిప్పిలు తెనుఁగుల తీపిపలుకు
నుభయకవిమిత్రులం దింత యొప్ప చున్కిఁ
దలఁప నూహింపమదికి సంతసము వొడమె.

---

## శ్రీ అచ్యుతుని వెంకటాచలపతిరావు కొల్లాపురము

తే. గీ. సల్లలిత సంస్కృతపదాలచల్లఁదనము,
తొల్లి తెల్గు కైతల తేఁటతెల్లఁదనము,
పల్లవగ్రాహి పాండిత్యవల్లభులను
తల్లక్రిందుగా నాడించు మల్ల బలము
విశ్వనాథ లక్ష్మణశాస్త్రి విహితకావ్య
విక్రమాంక చరితలోన వెలయుచుండు.

---

## శ్రీ వేదవరపు రామబ్రహ్మశాస్త్రి

కర్నూలు.

మ. పదచాతుర్యము, నర్థసంగతి, రసప్రాచుర్య, మాచిత్య సం
పద, భావోన్నతి, వర్ణనప్రతిభ, శాబ్దప్రక్రియాప్రాభవం,
బుదితాలంకృతు, వ్యంగ్యవైభవము, నేయోజన్ గనన్ లేవ యే
కొదవల్, బిల్హణకావ్యవైఖరికి మీకుం జెల్లె నాంధ్రీకృతిన్.

చ. సుకవులు మెచ్చు సాధుపటుసూక్తుల లక్ష్మణశాస్త్రి విశ్వనా
థకవులు విక్రమాంక చరితం బల బిల్హణ కావ్యఫక్కి వీ
డక తెనిఁగించి పంబూనిన కడంకఁ గృతార్థతఁ బొంది రార! త
త్సుకృతి సుధాంశుచంద్రికలఁ జొక్కెరె యాంధ్రసుహృచ్చకోరముల్.

---

## శ్రీ టి. కే. సుదర్శనాచార్యులు

న్యాయ, వేదాంత సాహిత్యాచార్యులు, సంస్కృతకళాశాల. తిరుపతి

శ్లో. సర్వజ్ఞస్సుమనోజ్ఞ బిల్హణకవి స్స్వేంధ్రావనీ పండితః,
ఉదండోనవసాహసాంక నృపతిశ్చాంధ్రావనీ వల్లభః,

రించుకొని కావ్యలక్షణముల నెఱింగినవారు విజ్ఞానదృష్టిని అలవఱచుకొనినవారు ఈ గ్రంథమును బఠించి యుందలి పరమార్థమును గ్రహించి యాశ్చర్యానందముల నోలలాడెదరు.
విశ్వవిద్యాలయములయందు ఉన్నత పరీక్షలకిది పాఠ్యగ్రంథముగా నుండ దగినది.

తెలుఁగుతల్లి చల్లఁగా నున్నంతకాలము, ఆంధ్రశారద మనియున్నంతకాలము ఈ కృతి ఆచంద్రార్కము నిలుచునని నేను విశ్వసించుచున్నాను.

—•••—

## శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ మద్రాసు

బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును. శ్రీ మాదిరాజు విశ్వనాథరావుగారును కలిసి యాంధ్రీకరించిన "విక్రమాంక దేవ చరిత"మను ప్రౌఢకావ్యమును రెండు తడవలు విని యానందింపఁగల భాగ్యమబ్బినది.

బిల్హణకవి విరచితమైన విక్రమాంక దేవచరితము సంస్కృతమునందలి ప్రౌఢకావ్యములలో నొకటి. ఆంధ్రీకృత కావ్యమున్ను శబ్దార్థాలంకార సమానభూయిష్టమై చక్కని శయ్యాపాకములఁబడి మిగుల ప్రౌఢమై సంస్కృతకావ్యమున కన్నివిధముల దీటువచ్చుచు మనస్సు నలరించుచున్నది. రచయితలుభయులును ఉభయభాషా పారంగతులును, కవితారహస్యవేదులును. వారికి సంస్కృతమున వలెనే అచ్చ తెనుఁగునను మంచి పాండిత్యమును ప్రజ్ఞయుఁ గలవు. కేవల మచ్చ తెనుఁగున వ్రాసిన పరికరణములే యిందుకు నిదర్శనము. గ్రంథకర్తలకవితాధార అనర్గళమయినది. ఆంధ్రీకరణమైనను తెనుఁగు కావ్యము హృద్యయముగ నుండి అది స్వతంత్ర గ్రంథమే యనిపించుచున్నది. ఇది పశ్చిమ చాళుక్య జననాథుఁడును, కల్యాణపురవరాధీశ్వరుఁడును అయిన విక్రమాదిత్యునికి సంబంధించిన చరిత్ర గ్రంథమగుటచేత నాకింకను ప్రియముగనున్నది.

ఇటీవలనే శ్రీ మాధిరాజు విశ్వనాథరావు స్వర్గతులైరని విని విచారించినాను. శ్రీ లక్ష్మణశాస్త్రిగారు మిత్రవియోగమ్ము వలన నిరుత్సాహులుకాక ఇంకను ఇట్టి యుత్తమ కావ్యములు రచించి యశస్సు నార్జింపవలెనని కోరుచున్నాను.



18. రుద్ధదిశాముఖంబు = దిక్కుల కొనలవఱకు వ్యాపించిన. ఉత్సారితలక్ష్మి = వెడలఁ గొట్టఁబడిన లక్ష్మీదేవి (సంపద). (సముద్ర మథన కాలములో లక్ష్మీదేవి పుట్టి బయటకు వచ్చి హరియురము చేరినది. అందుచే లక్ష్మి (సంపద) పోయినసముద్రము శ్రీగలదీని కీడు కా దని భావము). పయఃపాంనిధి=జలనిధి( అలుక్సమాసము).

21. కానినియమంబు=పనికిమాలిన నేమము. గాఢ్ధద్యము = దగ్గుత్తుక.
22. జిష్ణునిదంతి= ఇంద్రుని యేనుఁగు (ఐరావతము), ఇంతికిన్=భార్యయైన 'అభ్రమువు' నకు.
23. శుక్తులు = ముత్తెపు చిప్పలు.
25. బ్రహ్మపురాఽవృతము = బ్రాహ్మణాగ్రహారముతోఁగూడిన నది.
26. చదురునన్ = చాతుర్యము (నేర్పు)తో (చాతుర్యశబ్దభవము).
27. అష్టాపదోత్కటభాదండములన్=బంగారపు ప్రకటములైన కాంతు లనెడి దండములందు,
28. తుంగిమంబు=ఔన్నత్యము (ఎత్తు) (తుంగయనెడి విశేషణమునకు ఇమనిచ్ అనుతద్ధితప్రత్యయము చేరి గుణనామవాచక మగును).
29. సారసబాంధవ సైంధవాళి=సూర్యుని గుఱ్ఱములు (సైంధవములు= సింధు దేశమునఁ బుట్టినవి. గుఱ్ఱములు).

30. త్రియామములు = రాత్రులు (మూడుజాముల కాలముమాత్రమే కలవి. సాయంకాల మాఱునుండి తొమ్మిది గంటలవఱకుఁ గలయామము రాత్రిలోఁ జేరదు). ప్రాలేయభానుఁడు = మంచుకిరణములు గలవాఁడు (చంద్రుఁడు). సుషమా = శోభ.
32 పర్వము పుణ్యకాలము. గో, భూ, హిరణ్యా దిదానములు షోడశ దానములు.

పద్యము,

33. తుంగసరిగ = తుంగ అనుగడ్డితో సమానముగ. పటీర=గంధము.
34 తపనీయ భూధరము=బంగరుకొండ (మేరువు). ఉత్పలములనేస్త=కలువల మిత్రుండు (చంద్రుండు). పారద=పాదరసము.

35. కనకతులారోహణము = త్రాసులో నొకవైపు బంగారముంచి రెండవవైపు తాను కూర్చొని తన తూకమునకు సరియగు సువర్ణమును ద్విజులకు దానముచేయు వ్రతము.

37. ధారుణీ నాన్వయములు = రాజవంశములు. రిక్తములు=ధనహీనములు. హాటకములు=బంగారములు. (ఈ పద్యమున సహోక్తి అలంకారము).

38. విశ్వచక్రవృద్ధి = ప్రపంచ మండలమునందు అభివృద్ధి. నలువ=బ్రహ్మ. (నాలుగు వాయిలు-ముఖములు) గలవాఁడు. ('వాయి' అనఁగా ద్రవిడభాషలలో 'నోరు' అనియర్థము ఉ॥వాకట్టు, వాయోడు మొ॥)

39. బాహుఖడ్గపు = భుజములతీఁట.

40. నిర్జరధనమానిని=వేల్పు వెలయాలు. క్రయాపణము=అమ్ముఅంగడి.

41. నాకుబిలము = పాముపుట్ట రంధ్రము.

44. అర్థకృత్త = సగము తెగిన.

46. మృణాళదండము = తామరతూఁటిక్రోవి (గొట్టము)

48. యామినీచారిణీపారికాళి = రాక్షసస్త్రీలు పట్టుకొనిన గిన్నెలు "పారీ, పారికా" అను పదములకు గిన్నె లని యర్థము.

49. వైలక్ష్యవంతుఁడు = విస్మయము గలవాడు. మగఁడు పౌరుషవంతుఁడు.

50. నమానము = అవమానము. (ఇట్లే "వరోధము, అవరోధము", "వధానము, అవధానము" "పిధానము, అపిధానము" అని రెండు రూపములు తెలుపుచున్నది). అగ్నిని = అగ్నిచేతను. క్షతజనది=నెత్తురు వఱ్ఱము.

ఏటు (క్షతము-గాయము) నుండి పుట్టుచున్నదిగనుక నెత్తుటికి క్షతజము పేరు.

51. దారితము =చీల్చబడినది. చౌదంతి=ఐరావతము (ఈ యేనుఁగునకు నాల్గు దంతము లుండును గాన)

52 సామురేవెలుఁగువాలులు= అర్ధచంద్రబాణములు. (సాము=సగము. రేవెలుఁగు = రాత్రివేళల వెలుఁగునట్టి చంద్రుఁడు, వాలు=అయు

థము). ద్యోపాళి = ఆకాశస్థలము (పాళి = స్థలము). పాళిల్గాలిక=
గోమరితనము. బిట్టుగన్ = కఠినముగా.

53. ద్యుస్రజంబులు = స్వర్గలోకపు పూలమాలికలు. శిరీషసుమ=దిరిసెన
పువ్వు. సంవరణమాల = స్వయంవరమాలిక.

55. ముధగ = వ్యర్థముగ.

56. జాలకగండి = గవాక్షము (కిటికీ). విందు = అతిథి (తెలుఁగులో
అతిథికి, అతిథికిఁ జేయుసత్కారమునకు రెంటికినిఁగూడ 'విందు' అని
యే పేరు.)

58. వేడబము=మాయ (కపటము-మోసము) నడఁగు=వెళ్లువాఁడు.

60. సురక్రియనాయికావళి = దేవవేశ్యాసమూహము. వెడవిలుకాఁడు =
మన్మథుఁడు. (వెడ=అల్పము (చెఱుకుతుంట) ఐరవిల్లుకలవాఁడు)

61. శరవ్యము = గుఱి. విశిఖ = బాణము.

62. ఉక్కరులు = వీరులు. నామసమంకితపత్రిసంతతి = నామాక్షరము
లచే గుర్తింపఁబడిన బాణసమూహము (పూర్వము మహావీరులు
యుద్ధములో విడుచుబాణములపైఁ దమపేర్లు చెక్కించుకొనువారు.
దూరమునుండి యాబాణము వచ్చి పడినపుడు అది యెవరిదని శత్రు
వులు దానినామాక్షరములచేఁ గనుఁగొనుచుండెడివారు (పత్రము
లనఁగా ఱెక్కలు అవి గలది గనుక పత్రి యన బాణము.)

పద్యము.

63. పెంగాఱియకార=గొప్పబాధకరమైన చెఱసాల (కార=చెఱసాల).
అఱ్ఱినశించి(అరి యని సాధురేఫము వాడిన ఒప్పి యని యర్థము).

64. శీర్ణకార్ముకతన్ — ఎక్కుపెట్టిన వింటిని డించుటచేత. రాపగు =
దట్టమైన. వీటికిన్=పట్టణమునకు (వీడు = పట్టణము) ఎమ్మెమెన్=
విలాసములో ("మెన్, మెయిన్" అనునవి తృతీయావిభక్తి ప్ర
త్యయ మగు "చేతన్. చేన్, తోడన్, తోన్" అనువానికి బదు
లుగా వాడఁబడును).

# తప్పొప్పుల పట్టి

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 9 | ప్రాంగణసీము | ప్రాంగణస్థలుల |
| ,, | 12 | చరాఽస్వాతివేల | చరాఽబ్జాంఽననాఽఽ |
| 5 | 18 | యౌవ్వన | యౌవన |
| 6 | 19 | భూషాఽఽయిత | భూషాఽమల |
| 7 | 20 | దొడరినటులఁదన | దొడరిన నెపమునఁ |
| 8 | | పసిఁడినిఁ | బసిఁడినిఁ |
| 9 | 3 | ల్వాడకుండ | ల్వాడలకుండ |
| 10 | 21 | లేమి | వేమి |
| 11 | 5 | మేకొనెజేష్టితముల్ | మేకొనఁజేష్టితముల్ |
| 12 | 1 | ఇంతతో | ఇంతలో |
| ,, | 7 | పత్రి | పత్రి |
| ,, | 11 | యుఁవికా | యువికా |
| ,, | 12 | బాణెను నట్టులోట | బాణెను, నట్టులోట, |

